# అంతరంగ తరంగాలు

(వచన కవిత)



: కృతికర్త :

" అభినవ సాహితీ సోమయాజి "

**ఆశావాది ప్రకాశరావు**



: ప్రచురణ :

**నవ్య సాహితీ సమితి**

ప్రొద్దుటూరు

కడప జిల్లా-516 360.

# అంతరంగ తరంగాలు

## ఇందులో





# మా మాట

డాక్టర్ షేక్ మహమ్మద్ ముస్తఫా,
ఎమ్.ఎ., పి హెచ్.డి.,

ఏ. సి. దస్తగిరి, పి.ఓ.ఎల్. భాషాప్రవీణ
అధ్యక్ష కార్యదర్శులు, నవ్య సాహితీ సమితి,
ప్రొద్దుటూరు-కడప జిల్లా. (ఆం.ప్ర.)

ప్రొద్దుటూరులో నవ్య సాహితీ సమితి స్థాపింపబడి ఇప్పటికి చాలా కాలమైంది. సంస్థ లక్ష్యాల కనుగుణంగా ఎన్నో సాహితీ సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించాము. వివిధ సమ్మేళనాలలో పండితులకు, కవులకు సన్మానాలు చేశాము. నాటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ గుర్తింపు సైతం నవ్య సాహితీ సమితి పొందింది. ఉదారాశయుల సహకారంతోను, తెలుగు విశ్వ విద్యాలయం ఆర్థిక సహాయంతోను ఎన్నో విలువైన గ్రంథాలు ప్రచురింపవలసి వుంది మేము ప్రచురించిన గ్రంథాలలో కొన్నిటిని పేర్కొనడం సముచితమని భావిస్తాము.

'అమృతమూర్తి' [పద్యకావ్యం] ప్రముఖ మొగల్ చక్రవర్తులలో ఒకడైన జహంగీరు చక్రవర్తి జీవితంలో జరిగిన ఒక సంఘటనకు రూప కల్పన ఈ కృతి. మత సామరస్యానికై జహంగీరు పాటుబడన తీరు ఈ రచనలో ప్రముఖంగా చోటు చేసుకొన్నది. డా. సి. నారాయణరెడ్డి గుంటూరు శేషేంద్రశర్మ, డా॥ నండూరి రామకృష్ణమాచార్య వంటి ప్రముఖుల ప్రశంసలు ఈ కృతి పొందింది. కర్త శ్రీ ఏ.సి. దస్తగిరి.

"మంజీర విలాసము" [పద్యకావ్యం కణ్ణగి కోవలన్ ల కథ] సంస్కృతాంధ్రాల్లో ఉద్దండ కవి పండితులు, బహుగ్రంథ కర్తలు విద్వ

త్కవి తిలక బిరుదాంచితులు శ్రీ జంధ్యాల వెంకటరమణయ్యగారు ఈ కృతి రచించారు. కీ॥శే॥ గడియారం వేంకటశేషశాస్త్రి స్మారక అవార్డు ఈ గ్రంథానికి లభించింది.

"ఉమర్ ఖయ్యామ్ రుబాయీల అనుశీలన" నాగార్జున విశ్వ విద్యాలయం వారి–ఎ– గ్రేడ్ ఎమ్ ఫిల్. డిగ్రీ పొందిన సిద్ధాంత గ్రంథ మిది రచయిత డా॥ షేక్ మహమ్మద్ ముస్తఫా

"రామలింగ శతకము" :- ప్రొద్దుటూరు రామేశ్వరంలో వెలసిన శ్రీ రామలింగేశ్వరస్వామి వారిపేర రచింపబడిన ముక్తరచన మిది, కర్త శ్రీ వి. ఎమ్, భాస్కరరాజు.

ఈ విధంగా వివిధ సాహితీ ప్రక్రియల్ని ప్రచురిస్తున్న మేము ప్రస్తుతం శ్రీ ఆశావాది ప్రకాశ రావు గారు రచించిన 'అంతరంగ తరంగాలు' [వచన కవితాసంపుటి] ప్రచురించి సాహితీప్రియులకు అందజేస్తున్నందుకు ఎంతో సంతోషిస్తున్నాము. శ్రీ ప్రకాశరావుగారు పద్యవిద్యలో ప్రవీణులు లబ్ధ ప్రతిష్ఠులు. సాహితీ జగత్తున వీరిపేరు తెలియనివారుండరు. పద్య విద్య యందే గాక వచన రచనలోనూ వీరు సిద్ధ హస్తులని 'అంతరంగతరంగాలు' నిరూపించింది. ఈ కవితల్లోని శిల్ప విన్యాసం భావరామణీయకం అపూర్వమని ప్రశంసంలదాయి.

ఈ పుస్తకాన్ని నవ్య సాహితీ సమితి ద్వారా ప్రచురించడానికి అనుమతించిన శ్రీ ఆశావాది ప్రకాశరావుగారికి కృతజ్ఞతాభివందనాలు "అంతరంగతరంగాలు" ఆంధ్ర కవితా లోకాన్ని సమ్మోగ్ధ పరచగలదనే విశ్వాసం మాకుంది.

ప్రొద్దుటూరు
2–9–90

(సం) యస్. యం. ముస్తఫా
(సం) ఎ.సి. దస్తగిరి

# అంతరంగ మథనం

**డా॥ రేవూరి అనంత పద్మనాభ రావు, M A., Ph.D.,**
స్టేషన్ డైరెక్టర్, ఆకాశవాణి, అనంతపురం.

అనంతపురంలో అధికారరీత్యా చేరిన తొలిరోజు నేను కలిసిన మొట్ట మొదటి సాహితీ మిత్రులు ఆశావాది ప్రకాశరావుగారు. గత 20 సంవత్సరాలుగా మా ఇద్దరి స్నేహవల్లరి అవధాన కవితా కన్యా సాహచర్యంలో పూలు పూసింది, పరిమళించింది వారొకసారి అవధానం చేయగా నేను పృచ్ఛక స్థానంలో వుండి వారి మహత్తర విద్వత్తును దర్శించి పులకించాను. ఆయన ఆశుధార, ఉక్తిచమత్కృతి, ధారణ ప్రశంసార్హాలు. అలాంటి ప్రాచీన కవితా ప్రావీణ్యుని చేతిలో వచన కవితా కన్య వొంపులు సొంపులు ఇందులో గమనించవచ్చు.

శబ్దంపై అధికారం, భావంలో నైశిత్యం, పద గుంఫనం వున్న రచయిత ఏది వ్రాసినా అది సహృదయ హృదయ రంజకంగా వుంటుంది ఛందో బద్ధమైన పద్యం ఆశువుగా చెప్పినా, పద్య శిల్పం కూచొని చెక్కినా, వచన కవిత వ్రాసినా, కవి సమ్యగ్దర్శనం అడుగడుగునా కనిపిస్తుంటుంది. అంతరంగ తరంగాలలో ఆశావాది 29 వచన కవితల్ని పొందుపరిచారు. భిన్న సందర్భాలలో, సభలలో, ఆకాశ వాణిలో, పత్రికలలో, ప్రచురితమైన ఈ కవితలు చాలా మందికి సుపరిచితాలు

'స్పందించిన సమయంలోనే
సమాధి బద్ధులయ్యే కవులు' అన్నారు ఆశావాది.

ఇందులో, కవితలు చాలా భాగం ఆయన హృదయ స్పందనను తెలియజేస్తున్నాయి. వ్యంగ్యంగా సమాజంలోని కుళ్లును ఎత్తి చూపే ప్రయత్నం ఈ కవితల్లో బాగా కన్పిస్తుంది.

'పుడమితల్లి పురిటి నొప్పులు తింటున్నది
నెలలు నిండినా నీళ్లాడటం లేదు'

అన్న వాక్యాలు కవి అంతరంగ మథనాన్ని వ్యక్తం చేస్తున్నాయి. ఈ కవితా సంపుటిని సాహితీ మిత్రులు, స్వయంగా మంచి కవి అయిన శ్రీ ఆర్. రంగస్వామిగౌడు దంపతులకు అంకితం యివ్వడం సంతోషం. వృత్తిరీత్యా రంగస్వామిగౌడుగారు యింజనీరు. ప్రవృత్తి రీత్యా కవితా చతుర్ముఖుడనవచ్చు.

ఖండికలకు పేరు పెట్టడంలోకూడా ఆశావాది నైపుణ్యం చూపారు. పుడమితల్లి పురిటినొప్పులు, రొయ్యమీసాలు, దీపవ్యథ, కాకిగోల, ముందుచూపు, యిలా కవి తన భావనైశిత్యాన్ని శీర్షికలలో కూడా ప్రదర్శించారు.

ముందుచూపు ఖండిక అక్షర లక్షలకు సమానం

ఈ లోకంలో
ప్రతి వెధవకూ ఉంది
ముందుచూపు
అందుకే
అమాంతంగా
'రేప్పని'
ఈనాడే మ్రింగేస్తున్నాడు.

ఇలా ఎన్ని కవితలైన ఉదాహరణకు చూపవచ్చు. భిన్న సందర్భాలలో వ్రాసిన కవితలు కావడంవల్ల ఏక సూత్రత లేక పోయినా ఈ సంపుటి ఆశావాదిని వచన కవిగా ఆంధ్రదేశానికి పరిచయం చేయడంలో దోహదం చేస్తుంది.

12-8-1990 (సం) ఆర్. పద్మనాభరావు.

# ఆశంస

ఆర్. ఎస్. సుదర్శనం,
Retd., Regional Joint Director of Higher Education (A.P.)
మదనపల్లి.

అష్టావధాని, ఛందోబద్ధ కవిత్వాన్ని ధారళంగా చెప్పగలిగిన ప్రతిభా వంతుడు, సాహిత్య సంప్రదాయజ్ఞుడు ఆశావాది ప్రకాశరావు. చాల నాళ్లుగా నాతో పరిచయం ఉన్నవాడు. అనంతపురం ప్రభుత్వ కళాశాలలో నా పర్యవేక్షణ క్రింద పనిచేసినవాడు. ఈనాడు ముక్త చ్ఛంద కవిత్వంలో అడుగుపెడుతూ, పరిచయ వాక్యాలు వ్రాయమని కోరుతున్నాడు.

సంతోషం. తెలుగు కవిత్వంలో ఎన్ని మార్పులు వచ్చినా దాని అవిచ్ఛిన్నతను, సాంస్కృతిక ఏకత్వాన్ని కాదనలేము! శ్రీ శ్రీ, తిలక్, శేషేంద్రశర్మ, సినారె-ఆధునికులెవరైనా వారి కవిత్వంలో పై జెప్పిన ఏకత్వం కనిపిస్తుంది. తెలుగు మహాకావ్యాల్ని అధ్యయనం చెయ్యడం ఆధునికుల ప్రతిభకూ అభివ్యక్తికి దోహదం చేసుందేతప్ప, వారిని గతానికి బందీల్ని చెయ్యదు-అన్న సత్యానికి ఆశావాది ప్రకాశరావు వ్రాసిన వచన కవితలు మరో తార్కాణం.

దీర్ఘంగా వ్రాసిన కవితల కంటె, యిందులోని 'మినీ కవితలు' నన్నెక్కువగా ఆకర్షించాయి. "కరచాలనంతో రాగాల సోయగాలు పోయే మూగవీణ, పెదవులు శ్రుతి చేయందే ఎదసొదలు వినిపింపదు ఇదే నేస్తంలోని రహస్యం" (రహస్యం) ఇందులోని శ్లేష, చమత్కారం, ధ్వని, ఆలోచనామృతం. తెలుగు కవిత్వ సంప్రదాయాన్ని అధ్యయనం చెయ్యని వచనకవి యిలాంటి కవిత వ్రాయలేడు.

'సంక్షోభ సంక్రాంతి' కవితలో-''మేమంతా పునరాయాత ద్వాపర యుగాంతంలో సముద్ర గర్భవిలీనమైన రేపల్లె వాసులం" అనీ ''స్వర్గ

ప్రసన్న సౌఖ్యాంబుధి నేలలాడే ఆశలతో భూతల దివిసీమలో వసివాడి పోయిన ప్రేతాలం '' అనీ వ్రాయడంలో 1977 నాటి దివిసీమ (కృష్ణా జిల్లా) ను ముంచెత్తిన ఉప్పెన ఒక్కటేకాక 1987లో ప్రజ్వరిల్లిన ద్వేషాగ్నులు ప్రజల్నీ, ఆస్తుల్నీ ధ్వంసం చెయ్యడంకూడా ధ్వనింప జేశాడు కవి. అందుకే "మేమంతా విషాద వదనంతో రాజ్యలక్ష్మిని గుడ్లప్పగించి చూస్తున్న దుర్బల నిస్సహాయులం" అన్నాడు. "ఈనాడు దేశాన్ని సంక్షుభితం చేస్తున్నది.. పెనుతుపానా? లేక నీతో పోటీ పడుతూ రంగవల్లులు తీర్చుకుంటున్న రాజకీయాలా? '' రక్త రంగవల్లులు !– ఇది ప్రతి ఆంధ్రుడూ నేటి రాజకీయ నేతల్ని వేస్తున్న ప్రశ్న !!

ఈ సంపుటిలోని కవితలన్నీ సమకాలీన జీవన సంక్షోభానికి స్పందించి వ్రాసినవే! "ఈ చెట్టు కాకులు వాలిన చెట్టయ్యింది" అని వాపోతున్నకవి ఆవేదనకు ప్రతి పాఠకుని హృదయమూ స్పందిస్తుంది. ''స్నేహం తరిగి పోయిన్నాడు, ఒళ్లంతా కాలిపోయిన్నాడు, చింతించి ఏం ప్రయోజనం? అంతా శూన్యం" (శూన్యం) మనుష్యుల మధ్య స్నేహం లోపించడం, దీపంలో స్నేహం తరిగి పోవడం, శూన్యానికీ, చీకటికీ తప్ప మరే గమ్యానికి తీసుకు వెళ్లదు? దీన్ని గురించి 'దీప వ్యథ' అనే ప్రత్యేక కవితే ఉన్నది. ఈ సంపుటిలో విప్లవం తప్పదు అన్న స్ఫూర్తి గల 'ప్రకటినొప్పులు' కవితతో సంపుటి ముగింపు.

పద్యకవితకూ, వచన కవితకూ వాక్య విన్యాసంలో విస్తరణ–సంక్షిప్తతల్లో తేడాలున్నాయి. దేని శిల్పం దానిది! ఈ తేడాలనూ, మెలకువల్నీ ప్రకాశరావు చాలవరకు అవగాహన చేసుకున్నాడు. అయితే కొన్నిచోట్ల పద్యం తాలూకు శైలీ వాసనలు తొంగిచూచాయి. వాటిని యిక్కడ ప్రస్తావించడం అనవసరం. అవి సక్వ్తత్తు.

వచన కవితలోనూ తన ప్రతిభా సామర్థ్యాలను వ్యక్తం చేస్తూ, కవిగా ప్రకాశరావు పురోగమించాలని నా ఆశంస.

26-8-1990 (సం) ఆర్.ఎస్. సుదర్శనం.

# అక్షర జ్యోతి

అష్టావధాని, విద్వాన్ మేడికుర్తి ఓబుల్లయ్య,
కార్యదర్శి: ఆశావాది సాహితీ కుటుంబం,
అనంతపురం-515 001.

గురుదేవులు శ్రీ ఆశావాది ప్రకాశరావు గారి పేరు వినగానే, శరీరము గగుర్పాటుతో పులకించి పోతుంది. గుండె ఆత్మీయాను రాగంతో నినదిస్తుంది. నవనాడులనుండి రక్తం కవితా ప్రవాహమై పొంగుతుంది. తప్పుల తడక నా గత జీవితం తొంగి చూస్తుంది. కూడు గుడ్డ ఇచ్చి తన ఇంట ఉంచుకొని, కన్నకొడుకుకన్నా మిన్నగా చూచిన వాత్సల్యం గుప్పుమంటూ ముందు నిలుస్తుంది.

లోకం పోకడ కవితారీతి తెలియని నాకు వీరి పరిచయం ఒక వరం పుస్తక పరిజ్ఞాన శూన్యుడైన నాకు వీరి హృదయమే ఒక పుస్తక భాండా గారం. ఆయన కవితా ప్రపంచమే అనిర్వచనీయమైన ఆనంద ధామం. అమృత తేజస్వి, స్థిరయశస్వియైన ఆయనను గురించి ఆలో చిస్తే వెన్నులో చైతన్యం పొంగుతుంది పెన్నులో సిరా ఖాళీ అవు తుంది. నన్ను నేను మరచిపోతాను.

నా విద్వాన్ చదువులో నేను నేర్చుకొన్న క్రొత్తయేమి లేదు. గురుదేవులు అంతరంగ తరంగంలో ఒక్క నురుగు నాపై తొణికింది. అంతే మా ప్రాచ్య కళాశాల నన్ను మొట్టమొదట వ్యక్తిగా నిలబెట్టి విద్వాన్ పట్టా సమర్పించింది.

శ్రీ ఆశావాది ప్రకాశరావుగారు నిత్యం ప్రవహించే కవితా స్రవంతి. కవితా వైజ్ఞానికులు ఆ స్రవంతికి తమ మనుస్సులో ఆనకట్టలు కట్టి కవితా నిధిని సృష్టించుకొంటారు. కవితా విద్యుత్తు పుట్టించి మనోజగత్తును వెలిగించుకొంటారు. కవి కృషీవలులు తమ జీవిత కేదారాలను సస్యశ్యామలం చేసికొంటారు. కవి కైవర్తులు కవితామత్స్యాన్వేషకులై తమ బుట్టల పొట్టలు నింపుకొంటారు. కవితా పిపాసకులు సుధాంబువుల నాస్వాదించి ప్రాణం నిలుపుకొంటారు. కవితా వ్యామోహం గలవారు జలకా లాడుతారు. అందుకే ఈయన నిత్యం ప్రవహించే స్రవంతి మాత్రమే.

మోడు జీవితాలను బాగుచేయటం, ఇతర కవుల గుండెల్లో కైతల పంటలు పడించటం, నవ్వుల పువ్వుల గంటలు మ్రోగించటం తప్ప తనకో స్థిరత్వమాసించి కావ్యం వ్రాసుకోవాలన్న కోరిక తీరిక ఉన్న జీవితం కాదు వీరిది. యథార్థానికి వీరి కవిత్వమంతా పుస్తకాలకెక్క లేదు. కానీ వీరే కవిత్వం. వీరి మాటే కవిత్వం. వీరి చేతలే కవిత్వం. వీరి మంచితనమే కవిత్వం. వీరి వాత్సల్యమే కవిత్వం. వీరి మైత్రీ బంధమే కవిత్వం. వీరి ప్రసంగమే కవిత్వం. వీరి బోధలే కవిత్వం. వీరి వ్యక్తిత్వమే కవిత్వం. వీరి లోని ప్రతి కదలిక కవిత్వం. వీరు చేస్తున్న ఉద్యోగం కవిత్వం. వీరు వేస్తున్న ప్రతి పదం కవిత్వం. వీరు జగమెరిగిన బ్రహ్మకల్పులు. కన్నవారు, విన్నవారు, మనసున్న వారు. బిరుదుల సన్మానాల కీర్తిపతాకను లోకంలో ఎప్పుడో రెపరెప లాడించారు. కడుపులో కత్తులుంచుకొని కౌగిలించుకొన్న వారుకుడా లేకపోలేదు. వారెవ్వరూ వీరి సేవను శకించలేరు.

ఒక్క దశాబ్దిలోనే ఉద్యోగరీత్యా గుంతకల్లు. నగరి, పుంగనూరు, పెనుకొండల బదలీల వల్ల ఒళ్ళు హూనం చేసుకున్నారు. హృదయంలో సుడిగుండాల గుండ్రాళ్ల దెబ్బలు బడబానలాల ఆరని జ్వాలలు, అగ్నిపర్వతాల ఉప్పెనల హోరులు, ఎన్నో వహించారు. సహించారు.

కనుక ఈ అంతరంగ తరంగాలలో కవితా కన్యక ముస్తాబైన పెళ్ళి కూతురై ముద్దులమూట గట్టుకొని సిగ్గుల చిరునవ్వుల దొంతరులు పందిరి పెట్టడమే కాదు. చిరుగు పాతల బరువు బ్రతుకుల వాడిగా వేడిగా నర్మ గర్భంగా చూపుల చురకత్తులు విసరగలదు. ఆవేదనాశ్రువు లుంచి ఆలోచనల ప్రగతిని రేకెత్తించగలదు.

మనసులోని మాట సంక్షిప్తంగా చెప్పాలంటే, సాహిత్య అకాడమీ కార్యవర్గ సభ్యులుగా ఐదేండ్లున్నా తనదంటూ ఒక్క పుస్తకాన్ని కూడా ముద్రించుకోలేని ప్రకృతి వారిది. బోలెడు సాంస్కృతిక సంస్థలు తన చేతిలో ఉన్నా తన రచనలేవి కనీసం అవిష్కరణకు కూడా పెట్టని నిరాడంబర బుద్ధి వారిది.

" ఆశావాది సాహితీ కుటుంబమనే " ఈ సంస్థ గురుదేవులు శ్రీ ఆశావాదికి కీర్తి కిరీటాన్ని తొడిగేదేమీ కాదు. కాగా ఈయనపట్ల అభిమానం కలిగి ఈయన గ్రంథాలు ముద్రించేవారితో ఆయన సభల్ని ఏర్పాటుచేసే వారితో సత్సంబంధాలు నిల్పుకొంటూ వారిలోని సారస్వత సేవా దీక్షను అట్లే కాపాడాలనే తత్పరత కలది. ఇందులో శ్రీ అవధానం రామనాథశర్మ, శ్రీ పార్నంది అన్నదానభట్లు, శ్రీ లోకా జగన్నాథశాస్త్రి, శ్రీ పి. పాండురంగాచార్య, శ్రీ శంకగంటి రమాకాంత్, శ్రీ ఘట్టమరాజు మారుతీరావు, డా॥ దమ్ము శ్రీనివాసుబాబు, శ్రీమతి కొలకలూరి స్వరూప రాణి ప్రభృతులు సభ్యులు. పదేండ్ల క్రితమే ముఖ పత్రంకూడ సిద్ధమై ముద్రణకు నోచుకోవలసిన ఈ గ్రంథము నేటికైనా వెలుగు చూస్తున్నం దుకు మహదానందంగా ఉంది. మీదు మిక్కిలి కవితాపిపాసగల సహృ దయ శిఖామణి శ్రీ ఆర్. రంగస్వామి గౌడు ఈ గ్రంథాన్ని అంకితం తీసుకోవడం, గ్రంథ సేవాభిలాషియైన శ్రీ బి నారాయణరెడ్డి ఆర్థికమైన చేయూతనివ్వటం చాలా మోదప్రదంగా ఉంది.

నాకు బాగా గుర్తు తిరుపతి తిరుమల దేవస్థానం వారి అభ్యర్థన మేరకు మా గురువుగారు పోతన భాగవత తృతీయ స్కంధానికి సరళ గద్యానువాదం చేసిన సందర్భంలో వారికొక ప్రశాంత వాతావరణాన్ని

కల్పించటానికి గొప్ప మనస్సుతో తన యింటికి ఆహ్వానించారు, శ్రీ గౌడ్ దంపతులు. రచనకు భిన్నంగా మనస్సు నెటు ప్రొయ్యగనీని సుముఖ వప తుల్ని కల్పించి తమ యింట రెండు వారాలకు పైగా ఆతిథ్యమిచ్చి ఒక పుణ్యకార్యంలో భాగస్వాములయ్యారు. శుద్ధ ప్రతిని తయారు చేసే అవ కాశం నాకుకూడా ఆ సమయంలో లభ్యమయ్యింది. అందుకే సహజంగా వెల్లివిరిసే కృతజ్ఞతాభావంతో శ్రీ గౌడ్ గారికి పొత్తాన్ని అంకితమిచ్చారు

ఇదంతి మూల కవితల్లో అంతస్స్రోతంగా ఒకానొక తాత్త్వికత గోచరిస్తుంది. మరి కొన్నింట వ్యంగ్యం ప్రధాన లక్షణం. ఇంకా కొన్నింటిలో శ్లేషాది పద్య బంధ అక్షర గౌరవం గోచరిస్తుంది కాల వాహినిలో కొనమెరుపుల్తో నిలుస్తున్న 'మినీ కవిత' గూడా వీరికి ప్రియం కావటం అభ్యుదయ సూచన.

మునకలువేసి ముత్యాలు వెలికితీయటానికి గురువుగారి అంతరంగ తరంగాలుదాటి లోతులను చూపటానికి నేను గజఈతగాన్నికాను. తినే ముందు కూరల రుచి చెప్పటం దేనికి. రసజ్ఞులు రసాస్వాదన చేసి వారి అంతరంగ తరంగాల సొగసు మాత్రమేచూచి తరించక, అంతరంగ సర్వస్వాన్ని ప్రజకందించే భాగ్యం కల్గిస్తారని మనసార ఆకాంక్షిస్తున్నాను.

నమస్కృతులతో
మీ వాడు
మేడికుర్తి ఫల్లయ్య.



కృతికర్త

**ఆశావాది ప్రకాశరావు**



కృతి ముద్రణా ద్రవ్యదాత

**శ్రీ బి. నారాయణరెడ్డి**

ఉత్తమ గ్రంథ పాలక పురస్కార గ్రహీత

జిల్లా గ్రంథాలయశాఖ, బుక్కరాయసముద్రం, అనంతపురం జిల్లా.

# * అంకితము *




ఆమె సహనానికి భూదేవి

అతడు సౌజన్యానికి శ్రీమన్నారాయణుడు

ఆమె ఆప్యాయతకు అన్నపూర్ణ

అతడు అనురాగానికి విశ్వేశ్వరుడు

ఆమె పవిత్రతకు సరస్వతి

అతడు పరిశ్రమకు చతుర్ముఖుడు

ఆమె సోదరి శ్రీమతి సుగుణమ్మ

అతడు మిత్ర శ్రీ ఆర్. రంగస్వామి గౌడు

ఈ అనురాగమయ దంపతులకు

నా అంతరంగ తరంగాలు అంకితము.

**- ఆశావాది -**

# అభినందన చందనాలు

నా వెన్ను తట్టి
నా కలం పట్టి
ఎందరో పఠితల హృదయాల్లో
'వేదనా తరంగాలు' సృష్టించిన
నా కవితా సంపుటికి
నామకరణం చేసింది... ఆయనే

మలేషియాలోని
మనవారి సాహితీ సంస్కృతులను
ప్రపంచ తెలుగు మహాసభల
అనుభవాలతో జోడించి
'మలేషియా మధురస్మృతులు'
పాఠక లోకానికి పంచేవరకు
నన్ను నిదుర పోనీయంది... ఆయనే!

కర్మవశాత్తు కాలువిరిగి
మంచాన బడ్డ నాకు
నాలుగు 'కోళ్ళే' సరిహద్దులై
దిక్కు తోచక శూన్యంలోకి
వీక్షించే అశ్రునయనాలు స్పృశించి
నా 'గుండెలోని నాదాలు'
సాహితీ జగతికి వినిపించింది... ఆయనే!

ఆ సాహితీమూర్తి-ఆశావాది
'అంతరంగతరంగాలు'
నను తాకి పునీతుణ్ణి చేసే యీ క్షణం
నా జీవితాన మళ్లీరాని మధుర క్షణం!

-కృతిభర్త-

**ఆర్. రంగ స్వామి గౌడ్**

# కృతజ్ఞత

నిజమాబాద్‌లో డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారి అధ్యక్షతన జరిగిన కవిసమ్మేళనంలో ''కాగితాల విప్లవ'' అనే కవితను అభినందించిన నాటి సభాసమీక్షకులు, సుప్రసిద్ధ సాహిత్య విమర్శకులు

*డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారికి*

''నీవు-నేను'' ''గాలిపటం'' అనే కవితల్ని హిందీలోనికి అనువదించి ఢిల్లీ నుండి వెలువడే ''భాష'' అనే పత్రికలోను, హైద్రాబాదు నుండి వెలువడే 'వివరణ్' అనే పత్రికలోను ముద్రణకు నోచుకునేటట్లు తోడ్పడిన, ఆదోని కళాశాల ప్రిన్సిపాల్

*డా॥ కమల్‌నాథ్ పంకజ్ గారికి*

''గోరంత దీపం'', ''సంక్షోభ సంక్రాంతి'', ''జ్యోతిర్మయి'', ''దీపవ్యథ'' ''పుడమితల్లి పురిటినొప్పులు'' అనే కవితల్ని రాష్ట్రంలోని అన్ని ఆకాశవాణి కేంద్రాల నుండి ప్రసారం చేయించిన

*కడప ఆకాశవాణి సంచాలకులకు*

''ఓదార్పు'', ''నంగనాచి''. ''భారీ పరిశ్రమలు'', ''పెనుభూతం'' అనే కవితల్ని క్రమంగా ప్రకటించిన గౌతమ ప్రభ (గుత్తి), నవత (నెల్లూరు), శ్రీవాణి (మచిలీపట్నం), ప్రసారిక (వరంగల్లు)

*పత్రికా సంపాదకులకు*

ఈ గ్రంథంలో ఆముఖంలో ప్రచురించుకోవటానికి అడిగిన వెంటనే తమ అమూల్యాభిప్రాయాలందించిన నుత సాహితీ మూర్తులు

*శ్రీ ఆర్. యస్. సుదర్శనం గారికి*

*డా॥ రేవూరి అనంత పద్మనాభ రావు గారికి*

ముద్రణకు సిద్ధమైన ప్రతిని సాకల్యంగా పరిశీలించి తగు సూచనలు, సవరణలు చేసిన అభిన్న మిత్రలు

శ్రీ కాంతి నారాయణ గారికి

గ్రంథ ముద్రణావ్యయాన్ని నేను భరిస్తానంటూ ముందుకు రావటమేకాక, లోగడకూడా నే చేపట్టిన రాయలకళాగోష్ఠి నిర్వహణలో ఎన్నోమారులు అజ్ఞాతంగా ఆర్థికమైన చేయూత నిచ్చిన హిత మతులు

శ్రీ బి. నారాయణరెడ్డి గారికి

ఆర్ద్రమైన మనస్సుతో అంకితం చేస్తున్నాను, దీన్నందుకొని నన్ను ఋణవిముక్తున్ని చేయండని కోరగా చిరునవ్వుతో అర్హుడైకూడా వినమ్రంగా తన భాగ్యంగా భావిస్తూ కృతినందుకొన్న ఆప్త మిత్రులు

శ్రీ ఆర్. రంగస్వామి గౌడ్ గారికి

ప్రచురణావకాశాన్ని తమ సంస్థకు దక్కించుకొని, తమలో ఒక్కడుగా నన్ను మన్నించి బాధ్యతగా కర్తవ్యం నిర్వహించిన.

డా॥ షేక్ మహమ్మద్ ముస్తఫా, శ్రీ ఎ. సి. దస్తగిరి గారికి

మీ శిష్యుడుగా "అక్షర జ్యోతి" వెలిగిస్తాను అతిశయోక్తులంటూ అవలకు నెట్టకుండా, మీ గ్రంథంలో చేర్చాలని పట్టుబట్టిన ఆదర్శ మార్గానుయాయి, ఆర్ద్ర మనస్కుడు. నా మానస సంతానము అయిన

చి॥ మేటికుర్తి పుల్లయ్యకు

ముఖపత్రాన్ని ముచ్చటగా గీసియిచ్చిన ప్రముఖ చిత్రకారుడు 'నాని' గారికి, ముద్రణనెంతో జాగ్రత్తగా నడిపిన భాను ప్రింటర్స్ వారికి. యజమానురాలు, సోదరి, శ్రీమతి ఎ, మాలిని గారికి హృదయ పూర్వక కృతజ్ఞతాభివాదములు.

- ఆశావాది ప్రకాశరావు.

# కాగితాల విలువ

ఇది
అచ్చుతో ముచ్చటపడే కాగితం

మూగ రాగాల ఆలాపనలూ
అవధి లేని అనురాగాల రోగాలూ
దీని ద్విముఖాలు

ఉత్తరాయణమైతే
ఉచితాసనం చూపే ఈ కాగితం
దక్షిణాయనమైతే
ఉన్నతోద్యోగమే ఇస్తుంది

అక్షరాంచితమైన దివ్వెగా
సంచలనాత్మకమైన రవ్వగా
వెలుగుతోంది–నవ్వుతోంది

దేశప్రగతి
ఈ కాగితాల మీదనే నడుస్తోంది

నా తరం పశువులు
ఈ కాగితాలనే మేస్తున్నాయ్

వెన్నెల్లో విహరిస్తే
విశ్వమోహన గీతం పాడే ఈ కాగితం
చీకటి బజారుల్లో
వికటాట్టహాసాల విలయతాండవం చేస్తోంది

## 2

పరిమళాల పూలదండలు
గందరగోళాల కారాగారాలు
ఈ కాగితాలు సమకూర్చే బహుమానాలు

పెద్దపెద్ద కాగితాలు
ఇకమీదట చెల్లవోయ్–అంటోంది
అవకాశవాదం పుంజుకొన్న ఒక సింహాసనం

మంచి కాగితాల సంపాదనకై
చెత్త కాగితాలు మార్చెయ్–అంటోంది
పట్టపగలే దగాబడ్డ తమ్ముళ్ళ మనస్సు

ఈదాకా వచ్చిన అన్ని రకాల కాగితాల్ని
సమూలంగా తగులబెట్టెయ్–అంటోంది
మరో లోకానికి పిలుస్తున్న విప్లవ కంఠం

ఇన్ని కాగితాలను విడమర్చుకొనేదెలా ?
ఇన్ని జీవితాలను ఒకటిగా నడిపేదెలా ?

ప్రేమాయణంలో రాయబారాల్ని
కామాయనంలో రాజసాటోపాల్ని
నడుపగల కాగితాల్నే ఈదాక మనం చూశాం
కాగడాలై కొంపల్ని కాల్చే కాగితాలు
ఈమధ్యనే
ఎక్కడపడితే అక్కడ దర్శనమిస్తున్నాయ్

భిన్నత్వంలో ఏకత్వానికెంత ముందో
ఏకత్వంలో భిన్నత్వానికీ

3

అంతే సమంగా పనిచేస్తున్నాయ్
పాపం!
పక్షపాతంలేని ఈ కాగితాలు
ఎటొచ్చీ వాటిని మోస్తున్న
ఈ చర్మపు తొడుగుల్దే లోపమంతా

ఇసుక వదిలి చక్కెర దినే
చిన్నిచిన్ని చీమల్లారా !
నీళ్లను విడిచి పాలను త్రావే
బుజ్జాయి హంసల్లారా !
పాతబడ్డ మనసుల్ని బాగుచేయలేక
లేత మనసుల్ని
మిమ్మ ఆశగా ఆహ్వానిస్తున్నా !

కన్నుల్లో కాంతులు తరగని యవ్వనంలో
చేతుల్లో చైతన్యం ఎరగని ఆర్జవంతో
సత్యపూతమైన నిత్యత్వాన్నీ
శివాత్మకమైన సౌందర్యాన్నీ
ఒక్కచోట మీకందించాలనే తపనతో
నా సోదరులు పేర్చిన
ఈ కాగితాల్ని చదవండి

వీనిలో జీవముంది
సంస్కృతీ వైభవముంది

మానిక శ్రద్ధతో మరీమరీ తిలకించండి

4

మీ గుండెల్లో
తొలికోడి కూతలు కూయిస్తాయి

మీ హృదయాల్లో
అరుణారుణ కాంతులు విరియిస్తాయి

మీ బ్రతుకుల్లో
నవ సూర్యోదయాలు ప్రభవిస్తాయి



## ఓదార్పు

కలతల అలలు
చెక్కిలి ఒడ్డుపై విసిరే
కన్నీళ్లకు
హడలెత్తకు,
హృదయం
సాగరమంత
విశాలమౌతున్నందుకు
సంతోషించు !!



5

## రాక్షస ఉగాది

ఏమమ్మా ! ఉగాదీ !
హుందాగా
నింపాదిగా
ఆనంద సదనంలో నివసిస్తూ
ఆదర్శ హృదయంతో నినదిస్తూ
ఇన్నాళ్లూ కాలం గడిపావ్
కన్నుల్లో కాంతులు నింపావ్

ప్రభవించడంతోనే
విభవ ప్రమోదాలు నీ సొమ్ములయ్యాయ్
మల్లెపూవుల తావుల్లో
లేత మామిడి చిగురుల్లో
నెయ్యమూ తియ్యమూ
సంతరించు కొన్నావ్

మా కేమో
నీ పలుకే ఒక ఆమని అయ్యేది
నీ తలపే సుఖ వసంతం తెచ్చేది

ఇదేంటమ్మా
ఇవాళ ఉన్నట్లుండి
అమాంతంగా

అనాలోచితంగా
రాక్షస వదనంలో
అడుగుపెడుతున్నావ్
శిక్షల వలయంలో
నడుము వంచుతున్నావ్

నీ ఆపాద మస్తక సౌందర్యం
కట్టూ బొట్టూ
పసిమి తప్పని పరువం
కాపాడలేని పాలనా వ్యవస్థలో
పూటలు లెక్కించుకుంటూ
బ్రతకాలని వచ్చావా?

నీ అమాయకత్వానికి
నవ్వాలో ఏడ్వాలో
అర్థమే కాలేదు

నీ మేలేదో కోరేవారిలా
దీర్ఘాయుష్మాన్భవ!
అని మేమంటాం అనుకో
అయినా నిన్ను సుఖంగా
బ్రతకనిచ్చేదవరబ్బా!
నీ యునికి గుర్తించేదెపుడబ్బా!

చూడమ్మా! ఉగాదీ
వేగి లేచిందే ప్రత్యక్షమై

7

పలుకరించే హృదయాలే మాకర్థంకావే
ఆ మనస్సేమంటోందో
తెలిసికొనే తపనే మాకు లేదే

అలాంటప్పుడు
ఏడాది కోమారు
కొత్త పేరుతో
వింత వేషంతో
మా గడపలో అడుగు పెట్టే నీవు
మాకేమర్థవుతావ్
నీ వర్తన మాకెలా బోధ పడుతుంది

మా కన్నుల్లో కామం
ప్రేమ కాటుక పెట్టుకొంటోంది
మా పనుల్లో స్వార్థం
త్యాగపు గోల్డ్ కవరింగ్ వేసి కొంటోంది

పాలకు నీటికి
తేడా తెలియని నేడు
జ్ఞానానికి కొలఖద్ద
లంచగొండి తనమే అయ్యింది

అన్యాయపు విన్యాసాలు
ఆవేశపు టార్భాటాలు
కనిపిస్తూ
వినిపిస్తూ

నిద్రలేకుండా చేస్తున్నాయ్
శాశ్వత నిద్రకే పంపుతున్నాయ్

ఓ నా మార్గదర్శి ఉగాదీ!
జ్ఞాన బోధల్తో
ఆరోగ్యామృతాన్ని పంచే
మోహన వంశి ఈనాడు లేదు

దాస్యంతో క్రుంగే దీనులకు
పురోగమన గంధం పంచే
బాపూ బోసి నవ్వులీనాడు లేవు

కర్తవ్యాన్ని జోకొడ్తూ
సందేశాల్ని నిద్రబుచ్చుతూ
అన్యాయానికి పాలిస్తూ
బూటకపు ముడుపుల్తో
స్వర్గానికి నిచ్చెన వేస్తున్నది
మానవత
కాదు కాదు మా–నవత

అందుకే
ఈ గాసట బీసట పరిస్థితుల్ని
నీవు చక్క చేయాలి
ఈ విష వాయువుల్ని
నీవు హరించే వేయాలి
ఈ బ్లాక్ మెయిల్ విలయ తాండవాన్ని
నీవు అరికట్టాలి
౦ ౦

9

# ఇదింతే

పువ్వులు విచ్చుకొనేలా
ప్రతి ఉదయం
విరజిమ్ముతుంది ఎన్నో కిరణాలను

నవ్వులు మెచ్చుకొనేలా
ప్రతి హృదయం
స్పందిస్తుంది ఎన్నో సమయాలను

విచ్చిన మెచ్చుకోలు
విచ్చుకత్తిలా పనిచేయాలి

కాని జరుగుతున్నదేమిటి?
చిలుంపట్టి
పదను కోల్పోయి
సానపెట్టేవారికై
ఆశగా చూస్తోంటో

కన్నులున్న గ్రుడ్డివాళ్లు
అలానే ముందుకెళుతున్నారు
మన్నుదిన్న పూడుబాములా



# నీవు - నేను

నీవు ప్రేయసివి
దివి నుండి భువికి
దిగివస్తున్న అమరమూర్తివి
అయినా మరణాన్ని గెల్వలేదు

నేను ప్రేమికుడను
భువి నుండి దివికి
నడుస్తున్న మానవ మాత్రుణ్ణి
అయినా మానవత్వం పెంచలేదు

మనిద్దరకూ సంగమ
స్థలం-సంసారవనం

నీవు కావ్యానివి
లేనిదున్నట్లు చెప్పి
ఉన్నదానిలో లేనిదానివి
అయినా నీకు లేనిది లేదు

నేను తత్త్వాన్ని
ఉన్నది లేనట్లు చెప్పి
లేనిదానిలో ఉన్నవాడిని
అయినా నాకు ఉన్నదిలేదు

మనకిర్వురకు సంగమస్థలం
భావ సమరం

11

## జ్యోతిర్మయి

ఎవరమ్మా జ్యోతీ!
నీ వెవరమ్మా!

ఏ నోట విన్నా నీవే వినబడుతున్నావ్
ఏ కంట చూచినా నీవే కనబడుతున్నావ్
మెల్లమెల్లగానే వస్తూ
మాతో బంధం పెంచుకొంటున్నావ్

ఎవరమ్మా జ్యోతీ!
నీవెవరమ్మా

నిన్నెవ్వరూ అనుసరించే వాళ్లేలేరా
మా వెంటనే అదేపనిగా వస్తున్నావ్
ఆజన్మ మరణాలు
అంటిపెట్టుకొని ఉంటున్నావ్

ఎవరమ్మా జ్యోతీ!
నీవెవరమ్మా!

పుట్టిన బిడ్డకు
భవిష్యత్ జీవన ప్రకాశం కలిగించేలా
పురిటింటిలో ఓ మూల
నీవే వెలుగుతున్నావ్

మరణావసానంలో
పరంధామ విలీనం తెలిసేలా
తల ప్రక్కగా సాఫీగా
నీవే కాంతులు విరజిమ్ముతున్నావ్

జన్మాంతరంలో కూడా
ఆత్మవై హత్తుకొని వస్తున్నావ్

ఎవరమ్మా జ్యోతీ!
నీవెవరమ్మా!

పగలంతా సూర్యుని ప్రతాపం
రాత్రంతా చంద్రుని సౌమ్యం
భావించేలా భ్రమింప చేస్తూ
కొడిగట్టిన గుడ్డి దీపాలతో
ఎలాగైనా సఖ్యం చేయాలనే
తపనతోనే
తగులం విడువనంటావ్

ఎవరమ్మా జ్యోతీ!
నీవెవరమ్మా!

వస్తు సందర్శనంలో
నిస్తుల ఉత్సుకత్వాన్ని పెంచే
స్పష్ట రేఖలకు మారుపేరు-నీవు

వినికిడి విజ్ఞానంలో
సుప్త వివేకాన్ని జాగృతం చేసే
చైతన్య శక్తికి మారుపేరు–నీవు

పురాస్మృతుల వాసన
అనంత వాయువుల్లో నుండియైనా
పసికట్టే ప్రతిభకు మారుపేరు–నీవు

రసనాంచలంపై
రుచి భేదాన్నిరూపించే
అమరజీవత్వానికి మారుపేరు–నీవు

నఖశిఖ పర్యంతం
పుల్కరింపుల మేల్కొల్పులు కల్గించే
స్పర్శానుఖానికి మారుపేరు–నీవు

పంచేంద్రియ ఉన్మాదానికి
ప్రాణంపోసి పవిత్రం చేసే
నవలావణ్యానికి మారుపేరు–నీవు

ఎవరమ్మా జ్యోతీ!
నీవెవరమ్మా!

ఈ జగత్తంతా
ఏకచ్ఛత్రాధిపత్యంతో
నీవే పాలిస్తున్నావ్

ఈలోకానికి శక్తీ-రక్తీ-ముక్తీ నీవే
నీవే లేకుంటే సర్వం శూన్యం
శూన్యంలో అంధకారం
అంధకారంలో అవివేకం

అందుకే

నీ సర్వాంతర్యామిత్వాన్ని
ఋజువు చేసికో

ధర్మ విజయారంభంలో
ప్రకృతి సిద్ధంగా
నీవు మీటిన నాటి మధుర సంగీతాన్నే
మా యెడదలో నిండినీ

అమావాస్య పున్నమిగా మారిన
ఈ శుభ వేళలో నీవు సంతరించిన
ఈ రుచిర దరహాస చంద్రికల్నే
మా గడపలో పండనీ

నీ ప్రయనాల
శంపాలతల తోరణాలు
మహస్సునల్లే నిలువనీ
మా సదనాల
మమతల మతాబాల
ఉషస్సు నిట్టే కొలవనీ

## 15

# భారీ పరిశ్రమలు

విద్యకు పరమార్థం
విజ్ఞానమా?
కాదు
ఆత్మవిశ్వాసం కలిగించటమా?
అసలేకాదు
మరేమిటి?
ఉద్యోగం... ఉద్యోగం...

విజ్ఞానానికి కొలబద్ద
ఆరంగుళాల సర్టిఫికెట్

కాగితాలమ్మే పరిశ్రమల దగ్గర
రెండు పాదాల గాడిదలు
క్యూలో నిలబడ్డాయి

అదృష్టంతో వచ్చిన ఉద్యోగంతో
కడుపు నిండటం లేదని
గడ్డిమేస్తున్నాయి

దినదినానికి
గడ్డి విలువ పెరుగుతోంది



## రహస్యం

కరచాలనంతో
రాగాల సోయగాలు పోయే
మూగవీణ

పెదవులు శ్రుతి చేయందే
ఎదసొదలు వినిపింపదు

ఇదే
నేస్తం లోని రహస్యం



## ముందు చూపు

ఈ లోకంలో
ప్రతి వెధవకూ ఉంది
ముందుచూపు

అందుకే
అమాంతంగా
'రేప్పని'
ఈనాడే ముగిస్తున్నాడు



# పెను భూతం

నేనెదిగాను
ఇప్పుడింకా ఎదుగుతున్నాను
ముందుకింకెంతగానో ఎదుగుతాను

చక్రవాళ పర్వతం అంచుల్దాకా
చంద్రమండలం దాకా
కాదు కాదు
ఆకాశం అవతలి అంచుల్దాకా

అగ్నికణాలు జిమ్మే కన్నుల్తో
పిడుగు లురిమే నోళ్లతో
పెనవేసికొన్న హస్తాల్తో
గుండెలేని పాడు మొండెంతో
సహస్ర రూపాల్తో ఎదిగాను
ఎదుగుతున్నాను
ఎదుగుతాను

నిరంకుశత్వంలో తెల్లమొగంతో
తల వంచిన నేను
స్వాతంత్ర్యంతో నల్లబజారులో
విర్రవీగాను
వెర్రివేషం వేశాను

ఎదిగామంటున్న వాళ్లు
ఎదుగుతున్నాం ఎదుగుతాం అనేవాళ్లు

ఏం చేస్తున్నారో తెలుసా
సర్వం హరించేస్తున్నారు

నన్నింకా మీరిలానే ఎదుగనిస్తే
మిమ్మల్నందర్నీ అట్టే మింగేస్తాను

ఇంతకూ
నేనెవర్నని మీ అనుమానం
గుప్తధనం బొజ్జపై ఉన్న యజ్ఞోపవీతాన్ని
అధిక ధరల పెనుభూతాన్ని

(.)

## ప్రశ్న

నిన్నటి పీడకల
వెక్కిరిస్తోంటే

రేపటి మధుర స్వప్నం
ఆహ్వానిస్తోంటే

నేటిని మాత్రం విస్మరిస్తూ
ఎటో పయనిస్తున్న ఓ బాట సారీ!
నీవూ కాలాతీత వ్యక్తివా?
నీకూ ఒక పుట్టిన పండుగా?

# గోరంత దీపం

ముక్కూ ముక్కూ నొక్కి
రెక్కా రెక్కా తట్టి
కన్నూ కన్నూ కలిపి
ఎదలో సొదలు రేపి
కంఠంలో మాధుర్యం
చిలికిస్తూ పలికింది
మగ కోయిల
తన నేస్తంతో

ఏయ్
మమతల మల్లీ!
వలపుల వల్లీ!
అటు చూడు
ఆ తోట ఎంత ముద్దొస్తోందో

దూర దూరంగా పెరిగిన ఆ చెట్లు
అనురాగపు లతల్తో
పెనవేసి కొన్నాయ్
ప్రసవామోదంతో
పొంగి పోతున్నాయ్
నిత్య యౌవనాన్ని
విరబూస్తున్నాయ్
కమ్మ కమ్మని మాటల్లో
తమ్ము తామే మరచి పోతున్నాయ్

నేల తడియారని ఆ భూమి
నీరింకని యీ ఊట బావి
మధు మాసాన్ని మరిపిస్తున్నాయ్
నందన వనాన్ని మొలిపిస్తున్నాయ్

వర్షం రాలేదని కాని
ఉన్నదని చాల్లేదని కాని
కన్నూ ఋన్నూ మనుకోకుండా
కలిసి మెలసి యుంటున్న
ఆ జంటల్ని చూస్తోంటే
నీకూ అలా ఉండాలని
పరిమితత్వంలోని
పరవశత్వంలో
భాగం పంచుకోవాలని
అనిపించలేదూ'

'ఏమో ప్రియా!
నీ వింత కోర్కె
నాకర్థమే కాలేదు

నీ నీడలో
వెచ్చంగా ఉండాలనుకొన్నా
నీ స్నేహంలో
కరగి పోవాలనుకున్నా
మన చెలిమికి చిహ్నంగా
అంతులేని సంతానం
పొందాలనుకొన్నా

ఈ తోటంతా
మన పిల్లలే
ఆకాశంలోని నక్షత్రాల్లా
కొమ్మ కొమ్మనా
రెమ్మ రెమ్మనా
కేరింతలు కొడుతోంటే
కలకలా గలగలా
నవ్వుతోంటే
చూసి పొంగి పోవాలనుకొన్నా

'ఓ నా ముద్దుల చెలీ!
నీ వెంత పిచ్చిదానివే
పిల్లల పెంపకం లోని మాధుర్యం
మనకేమైనా తెలుసా
నీ పని ఏది నా పని నాదిగా
ఉడాయిస్తున్నాం
కాకి గూటిలో పడవేస్తున్నాం
పెరిగి పెద్దలయ్యాక
మన పిల్లలే అంటూ
అభిమానం చూపుతున్నాం

ఇంటి కోసం వంట కోసం
తమలో తామే కాట్లాడే
ఈ పిల్లలు
మనల తరిమేస్తారే

వంట చెరుకుకై
కల్పవృక్షాన్నే నరికేస్తున్నారే
దయావిహీనులు
మనకెక్కడ దక్కుతుందే-గూడు

అందుకే
నీకో చిట్కా చెబుతా-విను

నీ నా రెక్కల్లో
ఎంచక్కా ఒదిగి పోయేలా
మన ఆదర్శ ధాంపత్యం
అందరికీ తెలిసేలా

ప్రకృతి మధ్య
మన ఉనికి ఆకర్షించేలా

మన ప్రేమలు
తరగకుండేలా

గోరంత దీపం
కొండలకు వెలుగులా
ఒక్కరో ఇద్దరో మేలు
చక్కగా బ్రతుకు
పండిస్తే చాలు



## అసమర్థత

ఉదయాన్నే
పెదవి విప్పిన సూర్య బింబం

తన తాపంలో తానే
వేగి పోవటం తప్ప

కష్టించే
కర్షకుని ఘర్మ జలానికి
పైసాకూడా
దక్కనీకుండా

అర్థాంతరంగా
అస్తమిస్తోంది



## రంగుల పక్షి

వాయువును
చీల్చుకొని వెళ్లే
రంగుల పక్షి

ప్రబోధారావంతో
కర్తవ్యాన్ని చాలించింది

ఆకలికై అలమటించే బిడ్డలకు
అనుబంధ క్షీరం మాత్రం
మిగిల్చింది



## గాలి పటం

దారు తెగిన గాలిపటం
ఎగరా లనుకోవడంలో తప్పు లేదు

సూత్రం తో
ఎగిరేయడానికి
ఎవరైనా ముందుకు వస్తే
అతనికా గాలిపటం
అప్పగిద్దాం
తథాస్తు! అందాం

అలా కాదని
ఏ మూలనో పడవేస్తే

ఏదో ప్రచండ వాయువు
తానే వస్తుంది
రక్షకుల కనుల్ని కప్పేస్తుంది
అమాంతంగా లేపుకొని వెళ్తుంది

తస్మాత్ జాగ్రత్త

# ప్రగతి ఫలాలు

చిట్టి పొట్టి చిన్నలం
జిలిబిలి పలుకుల చిలకలం
ఆమని పూర్ణ చంద్రులం
అరుణోదయ భానులం

ఆరోగ్యపు ఆటల్లో
హాయిగా విహరిస్తాం
ఆనందాల బాటల్లో
అహర్నిశలు పాల్గొంటాం

ఈ చింపిరి తలల్లో
ఏ విశ్వ కవితా నినాదం ఉందో

ఈ అమాయకపు చూపుల్లో
ఏ రాజ్యాంగ నిర్మాణ దక్షత ఉందో

ఈ చిలిపి చేష్టల్లో
ఏ ఆత్మీయతా బంధం ఉందో

కులం తక్కువని కూలద్రోయకు
గుణమణియై సౌరభం విరజిమ్మవచ్చు

ధనం తక్కువని దబాయించకు
మనీషా విశేషాల మాధుర్యం పంచవచ్చు

ఈ మా తొక్కు పల్కులే
వివేకానందుని సింహగర్జన లౌతాయి

ఈ మా వినయ సంప్రశ్నలే
అల్లూరి సీతారామరాజు విప్లవా లౌతాయి

ఈ మా బుడిబుడి నడకలే
జగన్నాటక సూత్రధారిత్వం వహిస్తాయి

అమ్మా నాన్న ల్లేని ఈ అనాధలకై
దిక్కు మొక్కు లేని ఈ దీనులకై
కళ్ళు కాళ్ళులేని ఈ అవిటోళ్లకై
చెవులూ నాల్కా లేని ఈ శిధిల శిల్పాలకై

మీ హృదయ కవాటాలు తెరవండి
కరుణా జ్యోతులు వెలిగించండి
ఉత్సాహపు ఊయల లూపండి
ప్రోత్సాహం నిచ్చెనపై నిలపండి

అభిమాన లతలై అధిరోహిస్తాం
ప్రగతి ఫలాల్ని అందిస్తాం



# కోలాహలం

కూపస్థ మండూకాలు
గొంతు సవరించుకొంటున్నాయి
ఆదర్శాల గుడ్ల గూబలు
సందేశాలు ఘోషిస్తున్నాయి

బ్రహ్మానందంగా మారిన విద్యకు
ప్రతిరూపాల్లా వెలిగి పోతున్నాయి

కర్మ యోగానికి భరత వాక్యాలు
సుఖ భోగాలకు నాందీ గీతాలు
ఎరవు తెచ్చుకొన్న గొంతుల్తో
ఆలపిస్తున్నాయి

వర్షాకాలపు మేఘాల వాటాన్ని పట్టి
ఊసరవెల్లి రంగులు పులుము కొంటున్నాయి

అభిమానాల పాల్లు జల్లుకే పొంగి పోతున్నాయి
భవిష్యత్తు మీది ఆశతో బయట పడుతున్నాయి
అందర్నీ ఆకర్షించాలని ఆరాట పడుతున్నాయి

రోడ్డంతా అడ్డదిడ్డంగా నడుస్తున్న
ఈ కోలాహలానికి తెరపడేదెప్పుడో?



# సంక్షోభ సంక్రాంతి

మా గడపలో అడుగు పెడుతూ
మమ్మాశీర్వదించడానికి వస్తున్న
ఓ సంక్రాంతి పురుషుడా!

నీకు మనసారా
స్వాగతం పల్కలేక పోతున్నాం
క్షమిస్తావు కదూ!

మేమంతా
కరాళ కాలసర్పంచే కాటు వేయబడి
అరకొర ప్రాణాల్తో మిగిలిన
సగటు మనుషులం

మేమంతా
సాగర చుంబిత సంసార సీమల్లో
పడి లేచే మకర కెరటాల్లో
చిక్కుకొన్న నిర్భాగ్యులం

మేమంతా
పునరాయాత ద్వాపర యుగాంతంలో
సముద్ర గర్భ విలీనమైన
రేపల్లె వాసులం

మేమంతా
స్వర్గ ప్రసన్న సౌఖ్యాంబుధి నోలోడే ఆశలతో

భూతల దివి సీమలో
వసివాడి పోయిన ప్రేతాలం

మేమంతా
విషాద వదనంతో చిన్నపోయిన రాజ్యలక్ష్మిని
గుడ్లప్పగించి చూస్తున్న
దుర్బల అసహాయులం

మేమంతా
అసుర మారుతానికి అమాంతంగా ఆహుతియై
చెట్టుకు గుట్ట కొక్కరుగా
విసరి వేయబడ్డ నిరుపేదలం

మేమంతా
ఉదార గరుత్మంతుల విరాళామృతంచే
మెల్లగా బలం పుంజుకొంటున్న
అర్ధాయుష్కులం

అందుకే
ఓ సంక్రాంతి పురుషుడా
నీకు మనసారా
స్వాగతం పల్కలేక పోతున్నాం

భోగి మంటల యెదుట
కేరింతలు కొట్టవలసిన మేము
దహన సంస్కారాల మధ్య
శవ జాగరణలు చేస్తున్నాం

కమ్మగా గొంతెత్తి
గొబ్బి పాటలు పాడవలసిన-మేము
ఉత్సాహంగా మూగవోయి
దుర్భర వేదనా గీతిక లాలపిస్తున్నాం

ముంగిట రస రమ్యంగా
రంగవల్లులు తీర్చవలసిన-మేము
చేతుల చైతన్యం విరిగి
మూల కూర్చున్నాం

ఖలి సంరంభ సమాగమ సూచనగా
సుప్రభాతం పాడవలసిన-మేము
విష కలుషిత ప్రత్యూష పవనాలచే
మూర్ఛితులౌతున్నాం

దాసరి తంబురా మీటులో
సంబరం చూపవలసిన-మేము
కాంతి దరిగిన కన్నుల్తో
ఆకసం వంక చూస్తున్నాం

పశువుల అలంకరణలో
చొక్కి పోవలసిన-మేము
విషాద మనస్కులమై
అంధకారంలో చిక్కిపోతున్నాం

తామర తంపరగా పంటల్ని
ఇంటికి తరలించవలసిన-మేము
సర్వం స్వాహా చేసిన జల ప్రళయంతో
రాజీ పడుతున్నాం

అందుకే
ఓ సంక్రాంతి పురుషుడా!
నీకు మనసారా
స్వాగతం పల్కలేక పోతున్నాం

మా చెల్లాయి
మధుర మోహన గాయని
వీధి గుమ్మంలో
జానెడు పొట్టకై పాట సంకితం చేస్తోంది

మా తమ్ముడు
చైతన్య చిత్ర కళా తపస్వి
బొగ్గుతో రోడ్లపై బొమ్మలుగీచి
పైసాలడుక్కుంటున్నాడు

మా అక్క
భవ్య నటనా విశారద
పిడికెడు కబళానికై అర్ధ నగ్నంగా
పగటి వేషాలు వేస్తోంది

మా అన్న
అశేష శేముషీ దురంధరుడు

పూటలు నెట్టే పొల్లు మాటల్తో
ప్రొద్దు గడుపుతున్నాడు

మా గృహం
పిల్లల ఆనందానికి కేతనమెత్తిన స్వర్గం
కడలేని నైరాశ్య భారంతో
ఒంటరిగా కన్నీరు విడుస్తోంది

మా ఊరు
నందన వనాన్ని తలదన్నే సుందరోద్యానం
నిత్య వసంత యౌవన సౌరభాన్ని
తుడముట్టా కోల్పోయింది

మా ప్రాంతం
నిరతాన్నదానాల ధర్మ సత్రం
అన్నమో రామచంద్రా! యని
బిట్టుగా అలమటిస్తోంది

అందుకే
ఓ సంక్రాంతి పురుషుడా!
నీకు మనసారా
స్వాగతం పల్కలేక పోతున్నాం

అయినా
మా అభ్యర్థన మన్నించడానికి వస్తున్న
సహృదయ ప్రతినిధిలా
నీ కనుచూపుల్లో ఆశావాదం కల్పిస్తున్నావ్

అది చేతికందే లోగా
ఎన్ని చీలిక లౌతుందో?

ఈ నాడు
నా దేశాన్ని సంక్షుభితం చేస్తున్నది
జలధి గర్భం చీల్చుకొచ్చిన పెనుతుపానా?
లేక
నీతో పోటీ పడుతూ
రంగవల్లులు తీర్చుకొంటున్న రాజకీయాలా?

ఈ సంకట పరిస్థితుల్లో
మనసు కూరట నిచ్చి బ్రతుకు పండించే
ఒక్క మంచి మాట
ఒక్క కన్నీటి చుక్క
ఏదీ? ఎక్కడ?

భూన భోంతరాల్ని
ఏక సూత్రం చేస్తున్న శాస్త్ర వైదుష్యం
ప్రకృతి వైపరీత్యాల్ని
అరికట్టలేక పోతోందా?

ఇపుడే
చెవిలో ఇల్లు కట్టుకొని వినబడుతోంది
ఒక సత్యం
"ప్రకృతి నారాధించు–ప్రేమించు
బదులుగా అది నిన్నారాధిస్తూ ప్రేమిస్తుంద"ని

ప్రేమకు దూరమై
లౌకిక జీవన లంపటులౌతున్నందుకేనా
దెబ్బ మీద దెబ్బగా
ఎనలేని శిక్షలనుభవిస్తున్నాం

నీవైనా
ప్రకృతి నడుపులోనికి తేలేక పోతున్నావ్

అందుకే
ఓ సంక్రాంతి పురుషుడా!
నీకు మనసారా
స్వాగతం పల్కలేక పోతున్నాం

మా గడపలో అడుగు పెడుతూ
మమ్మాశీర్వదించడానికి వస్తున్నా
నీకు మనసారా
స్వాగతం పల్కలేక పోతున్నాం



35

## నంగనాచి

నంగనాచి ఆకాశం
ఒళ్లంతా
కళ్లు చేసికొని

రేచీకటి వ్యాపారాల్ని
గుడ్లప్పగించి
చూస్తోంది



## భిన్న గమనాలు

కవితల లో
ఎదగాలి
ఇది పురోగమనం,

కవి–తల–లో
ఎద–గాలి
ఇది తిరోగమనం;

[•]

# రౌద్య్ర మీసాలు

అవధానం లేని చిత్తంతో
నవ భావాలనే బెత్తంతో
మేధావంతుల బెదిరిస్తూ
ఏదో ఏదో ఒదిరేస్తూ
ధ్యేయం వీడి
గేయం పాడి

పూర్వార్జిత ధీ బలం
నశింప చేసే మా ఛలం
మీరంగీకరిస్తారా?

మీతో వీంపని
మూలనున్న ముసలమ్మలనూ
వారి గుసగుసల్లోని గూఢార్థాలనూ
పరామర్శించే తీరికేదీ

ఇంతకూ
ఆ పాటి విశాల హృదయం మాకుందటారా?

దాచాడట! మానాన్న...ఇంటిలో
రత్నాలూ వైడూర్యాలూ
నిక్కచ్చిగా
ఎక్కడుందో చెబితే
గటుం పోతుందా?

పోనీ... నిదానంగా వెదికి
తీసికొనే ఓర్పు మాకుందంటారా?
వడ్డించిన విస్తరైతే
గబా గబా మెక్కేస్తాం

నీతులు బోధించే చినవాళ్లం
కాలానికి కళ్లెం వేసే మొనగాళ్లం
దొంగల బట్టే దొరగారికి
దొంగ వేషం గమ్మత్తంటూ
అలవాటు మీద మెల్లగా
ఆ కూటికి లోబడుతాం

సోడా బుడ్డీ శూరత చూపి
ముందుకు వడిగా త్రోసుక పోతాం

***

## భావదాస్యం

తెరచి ఉంచిన
ఈ తరుణ కవాటం

పిల్ల గాలుల్తో
మత్తుగా విహరిస్తోంది

స్వాతంత్ర్యం, అమ్ముకొని
మనసారా
భావదాస్యం అంగీకరిస్తోంది

(౦)

## శూన్యం

పాపం!
యువ ప్రమిదలు
బుద్ధి పూర్వకంగానే ఆశా జ్యోతుల్ని
నెత్తికెక్కించు కొంటున్నాయి

స్నేహం తరగి పోయిన్నాడు
ఒళ్లంతా కాలిపోయిన్నాడు
చింతించి ఏం ప్రయోజనం?
అంతా శూన్యం



## శిక్ష

నా కాళ్లల్లో చక్రాలున్నాయ్
నా కళ్లల్లో నక్రాలున్నాయ్

చక్ర భ్రమణం చేసిన నక్రం
మత్తేభ యానాన్నరి కట్టింది

నా చేతల్లో గోతులు ఉన్నాయ్
నా వ్రాతల్లో నీతులు ఉన్నాయ్

నీతులు నిండిన గోతుల్లో
హరిణాస్యం రక్తం చిందింది



# దీపవ్యథ

నా కనుపాపల కాంతిని చిందించే
నా తలపోతల శాంతిని సంధించే
కాకర పువ్వుల నవ్వుల పాపా!
బుజ బుజ రేకుల ముద్దుల పాపా!

గుండె గూటిలో చీకటి చిందులుమరచి
గూటి గుమ్మంలో దీపాల విందులు వలచి
చిట పటాలాడేవు చిచ్చు బుడ్డీలా
దారి తప్పి యెగిరేవు తారా జువ్వలా

వచ్చిందని ఓ పండగ
హెచ్చిస్తావా ఈ దండుగ
జాతి కిది ఆదాయం కాదు
నీతి కిది ఆధారం కాదు

నింగిలోని నీలాకాశం తనువు
పొంగి పూస్తోంది ఇంద్రుని ధనువు
ప్రకృతి సిద్ధమైన ఈ పర్వం పంచుకో
సుకృతి ఇద్ధమైన ఈ సూనృతి నందుకో

సృష్టికి పూర్వం పుష్టికి ఆద్యం
పెను చీకటిని పెళ్లగించుకొని వచ్చింది వెలుగు
కనుగొన్నాడు ప్రాక్తన మానవుడు ఆ మెరుగు

ప్రేమకు సంకేతంగా వెలుగును పెంచాలని
విశ్వాసానికి అవధిగా వెలుగును పంచాలని
తపన చెందాడు జతన మూనాడు

దివ్వెలు దివ్వెలు దివ్వెలు దివ్వెలు
అడుగు అడుగునా గడప గడపనా
దివ్వెల మువ్వలు తేజరిల్లినవి

ఇంతలోనే ఒక వికటాట్టహాసం
పొంతనే పొంచియున్న మోసం

మెలకువంటేనే సరిపడని దోషాచరులు
వెలుగంటేనే భయపడే నరకాసురులు
కాలం కాటు వేసిన చోటులో
గాలం మాటు చేసిన బాటలో
వెలుగుపై దాడి చేశారు మహా క్రూరంగా
విలువ లేని పాలన సాగిస్తున్నారు ఘోరంగా

పరా భూతమైన ఆ దీప వ్యథ
జరాక్రాంతమైన ఆ శాప కథ
ఊరి వెలి వాడల్లో జీవిస్తోంది
పూరి గుడిసెల్లో వినవస్తోంది

అందుకే అందుకే
కొందరికే ఇది దీపావళి పంచాంగ కర్తల వ్రాతల్లో
ఎందరికో ఇది శోకావళి వంచనా వర్తుల చేతల్లో

ఎవడు దొంగతనం చేసినా
ఆ దీపాన్నే కట కటాల్లో బంధిస్తారు
ఎవడు అరాచకం జరిపినా
ఆ దీపాన్నే అందరూ ఆడి పోసుకుంటారు
ఎవడు అదనంగా ఏ పక్షానికి ఓటు వేసినా
ఆ దీప స్థాపరాన్నే సమూలంగా బూడిద చేస్తారు

నీ పంట పొలాల్లో జలమై
నీ యింటి ముంగిట్లో కలిమై
నీ పిల్లల ఆనందానికి కొలువై
నీ ఇల్లాలి విశ్రాంతికి నెలవై
వెలుగు ఫలం సర్వం నీకివ్వటమేనా దాని తప్పు
చితికి ఒదిగి శూన్యంలో నిల్వటమేనా దాని ముప్పు

కన్నుల్లో వెన్నెల నింపిన ముగ్ధ మోహన దీపం
విన్న మొన్ననే మెట్టింది దగ్ధ జీవన సంసారం
అనురాగాల స్నేహం ఆనక ముందే
అనుభూతుల దాహం తీరక ముందే
భర్త ప్రలోభాలకు వెలియై
అత్త అమానుషాలకు బలియై
చితి కెక్కిన సతిగా విలపిస్తోంది
గతి తప్పిన శ్రుతిలా నినదిస్తోంది

పట్టాల కట్టల్తో ప్రతిభా దీపం
పరుగిడుతోంది ఉద్యోగానికి పాపం
బరువులు పెట్టలేక పరువులు వేయలేక

వంచన చేసిన వైనం చూచి
న్యాయం కోసం నాల్కలు చాచి
నరికి వేయబడుతోంది నడి వరోడ్డులో
ఉరి తీయబడుతోంది ఊరి తోపులో

ఇలా త్యాగానికి ప్రతీకయైన ఎన్నో దీపాలు
ఇలా సత్యానికి ప్రాణమైన మరెన్నో దీపాలు
చీకటి గోళంలో క్షీణిస్తున్నాయి
ఆశ్రయం కరవై అంతరిస్తున్నాయి

భా-రత మంటేనే వెలుగులో క్రీడించడం
మన వ్రత మంతా వెలుగు ప్రవచించటం
ఈ సత్య స్థాపనకై
నడుం బిగించండి ఇకనైనా
ఈ నిత్య స్పందనకై
ముందుకు దూకండి ఇంకైనా



43

# కాకి గోల

శీతల పర్వతచ్ఛాయల్లో
గంగా పానంతో ఏపుగా పెరిగిన ఈ చెట్టు
వేద శాఖల్తో
కవితా సౌరభాలు విరజిమ్మిన ఈ చెట్టు
కల్ప వృక్షంలా
ఎందరికో ఆశ్రయమిచ్చిన ఈ చెట్టు
కాకులు వాలిన చెట్టయ్యింది

ఒక కాకి చెవులు చిల్లులు పడేలా అరుస్తూ
ఆ శ్రితుల నెత్తిని రెట్టతో పావనం చేసింది
ఇంకో కాకి స్వైర విహారం చేస్తూ
పద తాడనంతో కొమ్మల్ని విరచింది
మరో కాకి తన యత్నం సఫలం కాలేదని
సమూలంగా అకుల్నే మేస్తూ కూర్చుంది

కడుపు నింపుకోవడం ఆపై
ఆ క్రింది అవసరం తీర్చుకోవటంతోనే
ఖరితెగిస్తున్న ఈ కాకుల గోలల్ని
ఓటనే రాయిని వాటంగా విసరి
ఇకనైనా ఆపండి

)i(

# చిన్నారి మంచితనం

ఈ చిన్నారి సుకుమార పుష్పం
తల్లి యొడి నుండి వేరు చేసినా
కమ్మగా వేయి వసంతాలు నవ్వుతుంది

వికసించిన విన్యాసం చూసి
వ్యభిచార గృహాల్లో పారేసినా
ఋతువులనధిగమించి
మత్తులో మందుగా పనికి వస్తుంది

ఒదుగూ బొదుగూ గలిగి
మగాడిలా మన గల్గితే
ప్లాస్టిక్ సర్జరీ చేయండి
స్వాతంత్ర్యాన్ని కోల్పోయి
సంపాదన నీ సన్నిధిలో ఉంచుతుంది

ఒంటిలో సత్తువతేన్నాడు
పోషించాల్సిన బరువైన్నాడు
ఊపిర్సాడనీయకండి
సానుభూతి దుప్పటి కప్పండి
రోడ్డు ప్రక్కన పరుండ బెట్టండి

'పరోపకారార్థ మిదం శరీరం'
గుండె లోతుల్లో నుండి వల్లె వేస్తుంది

తన అంతిమ క్రియ లటుంచి
నీ ఆకలి దప్పులు తీర్చటానికి
పైసా పైసా సమకూర్చుతుంది

ఇంతగా వంచింప బడినా
నీ మేలునే కోరుతున్న
ఈ చిన్నారి సుకుమార పుష్పం
ఎంత మంచిది !?

(౮)

## దేశాభిమానం

దేశాభిమానం పొంగి పొరలి
మురికి కాల్వై పారుచున్నది
పట్ట పగలే ట్యూబు లైట్లు
వీధులంతా వెలుగు చున్నవి
ఏక ధారగ ట్యాపు వాటరు
దారులన్నీ తడుపు చున్నవి

దేశ భక్షణ ధ్యేయ మంటూ
రాజకీయం రాగం తీస్తే
స్వార్థ చింతన చాలునంటూ
అంతరంగం ఆశ చూపెను
అవకాశవాదం ఆరుబయలున
ఉపన్యాసం దంచు తున్నది

# పుడమి తల్లి పురిటి నొప్పులు

పుడమి తల్లి పురిటి నొప్పులు తింటున్నది
నెలలు నిండినా నీళ్లాడం లేదు
శస్త్ర చికిత్స చేస్తే తప్ప
శిశూదయ మయ్యేటట్లు లేదు

అవధుల్లేని అవేదనకు గురవుతున్న
ఈ దయనీయ స్థితిలో
సర్వేశ్వరుని సమ్యగ్దర్శనం కావాలని
పంచ ప్రాణాలు
అనంత వాయువుల్లో కలుస్తున్న
ఈ అంతిమ యాత్రలో
వాయిసూను డిచ్చే
సంజీవనీ మూలిక నాఘ్రాణించాలని
ఏవేవో ఆశల్తో ముడివడి
మరేవేవో పాశాల్తో సుడివడి
శుభం పల్కే ఆకాశ వాణికై జపిస్తూ
అభయమిచ్చేఅదృశ్య పాణికై తపిస్తూ
పుడమి తల్లి పురిటి నొప్పులు తింటున్నది

స్పందించిన సమయంలోనే
సమాధి బద్ధులయ్యే కవులు
కన్నుల బడ్డ సకల సన్నివేశాలకూ
రసమయాకృతి నిచ్చే శిల్పులూ

రవి చంద్రుల గతులు తప్పినా
సత్యాన్నే షష్ఠింపజేసే ఋషులూ
కట్నాల సంతలో కళ ఉడిగిన చెల్లెళ్లకు
కర్తవ్యం బోధిస్తూ
ఊసరవెల్లి రాజకీయాల్లో
ఊపిరమ్ముకొంటున్న తమ్ముళ్లకు
ఊరటను కల్గిస్తూ

మొగ్గను త్రుంచే దానవులపై దాడిగా
పిందెను కోసే మందులపై ప్రేలుడుగా
సద్యః సమస్యల చిత్రణకూ
సమర శంఖం పూరణకూ
భువన విజయం కోరి కవన కదనం చేరి
శాంతి దూతలై కలాలు ఝుళిపించాలనీ
క్రాంతి నేతలై గళాలు గర్జించాలనీ
పుడమి తల్లి పురిటి నొప్పులు తింటున్నది

కుష్టు వ్యవస్థకు పహారా కాస్తున్న
కొండల్ని పిండి చేయాలనీ
కుళ్లుస్వ రూపాన్ని రమ్యంగా చూపిస్తున్న
అద్దాల్ని బ్రద్దలు చేయాలనీ
స్వార్థం తోట లోని నిర్గంధ కుసుమాల్ని
ఏరి పార వేయటానికి
లోభం బాట లోని ప్రత్యక్ష కంటకాల్ని
సమూలంగా కాల్చి వేయటానికి

ఎవ్వడో ఒక్కడు గొంతెత్తి చాటితే
ఎక్కడో ఒక చోట చైతన్యం మీటితే
స్వాతంత్ర్యం ముసుగులో
పంజావిప్పిన ప్రజా స్వామ్యం
సంకెళ్లతో పాణి గ్రహణం చేయిస్తోందనీ
బుల్లెట్లతో మాంగల్యం పాడిస్తోందనీ
పుడమి తల్లి పురిటి నొప్పులు తింటున్నది
నెలలు నిండినా నీళ్లాడటం లేదు

తృప్తిగా సముద్రాల్ని త్రాగుతూ
మత్తుగా అంబరాన్ని చుంబిస్తూ
పిల్ల గాలుల స్నేహంతో
ఒళ్లు మరచి పులకిస్తూ
ఎడారులో పరుగులుతీస్తూ
అవకాశవాదాల మేఘాల మేటి నాయకులు
కాలాతీతంగా దర్శిస్తేనేం
కల్లోలాన్ని సృష్టిస్తున్నందుకు
కుండ పోతగా వర్షిస్తేనేం
హర్షాన్ని తుడిచేస్తున్నందుకు

రక్తాన్ని స్వేదంగా కార్చి
ఎముకల్ని కంకరగా మార్చి
సమాజ సౌధానికి పునాదులు వేసిన
బడుగులకు మాత్రం
గొంతైనా తడవటం లేదని

ప్రకృతి బీభత్సాలకూ
వికృతి వికటాట్టహాసాలకూ
పొగిలి పొగిలి దుఃఖిస్తూ
పుడమి తల్లి పురిటి నొప్పులు తింటున్నది
నెలలు నిండినా నీళ్లాడటం లేదు

బస్సుల్లోని ప్రథమ చికిత్స పెటికల్లో
శుష్క ప్రియాల వెనుక శూన్య హస్తాలు చూసీ
అరచేతిలో యిమిడే అగ్గిపెట్టెల్లా
ఊరికి దూరంగా బారులు దీరిన వాటికల్లో
అస్పృశ్యతా నివారణ
అమలయ్యే విధానం చూసీ
పొగ త్రాగటం ఆరోగ్యానికి హానికర మంటూ
సిగరెట్ ప్యాక్ ఓ మూలన్వేసే సన్నని రొదలో
ఆదర్శాలు రూపొందిన
అందమైన అబద్ధాలు చూసీ
ఐదేళ్ల అధిపత్యంలో
అంచె లంచెలుగా పెరిగిన ఆస్తుల అంతస్తుల్ని చూసీ
పుడమి తల్లి పురిటి నొప్పులు తింటున్నది

ఊది బత్తులై ఉత్సాహం పెంచిన
ఆనాటి త్యాగయోగాల భాగస్వామ్యం స్మరించి
కాగడాలై కొంపల్ని కాల్చుతున్న
ఈ మేటి భోగ రాగాల బాగోతాలు గణించి

విలువలు తరిగి తులువలు పెరిగి
పరస్పరం కాళ్లతో తన్నుకొనే
రాసభ రాజకీయాల రణ రంగంలో
ఒకళ్లనొకళ్లు పీక్కుతినే
రాబందుల ఇష్టారాజ్యంలో

ప్రజాశ్రేయమే కరువై
సజావు జీవనమే బరువై
ధనం పణంగా పెట్టి
ఉద్యోగపు వెలయాలిని కొంటున్న
అవివేకుల వేలంలో నక్కి
అంధకారం అలమి నందుకు
కబంధహస్తాలు కామిస్తున్నందుకు

పట్టపగలు నట్ట నడిరోడ్డులో
వల్వలూడ్చబడ్డ ఓ నగర కాంతలా
పుడమి తల్లి పురిటి నొప్పులు తింటున్నది
నెలలు నిండినా నీళ్లాడటం లేదు
శస్త్ర చికిత్స చేస్తే తప్ప
శిశూదయ మయ్యేట్లు లేదు



## శ్రీ ఆర్. రంగస్వామిగౌడ్‌గారి రచనలు

(1) వేదనా తరంగాలు

(2) గుండె లోని నాదాలు

(3) మలేషియా మధుర స్మృతులు

## శ్రీ బి. నారాయణరెడ్డిగారు చేయూతనచ్చిన గ్రంథాలు :-

(1) గుత్తి చరిత్ర

(2) అంతరంగ తరంగాలు

## శ్రీ ఆశావాది ప్రకాశరావుగారి రచనలు :-

(1) పుష్పాంజలి

(2) మెరుపు తీగలు

(3) లోకలీలా సూక్తము

(4) అంతరంగ తరంగాలు

(5) విద్యావిభూషణ [గద్యము]

(6) ప్రహ్లాద చరిత్ర—ఎఱ్ఱన పోతన
తులనాత్మక పరిశీలన [విమర్శ]
[జి. చెన్నయ్యగారితో సంయుక్త రచన]

(7) పోతన భాగవత తృతీయ స్కంధము
[గద్యానువాదము టి.టి.డి. ప్రచురణ]

(8) శ్రీ జ్యోతి స్సుప్రభాతము [గద్యానువాదము]

(9) తాళ్లపాక అన్నయ్య చెల్లపిళ్లరాయ చరిత్రము
[పరిష్కరణ]

(10) రాప్తాటి ఓబిరెడ్డి నిరోష్ఠ్య కృష్ణ శతకము.
[పరిష్కరణ]

(11) ఆర్కెష్ట్రా [సంకలనం]

(12) శ్రీ హనుమత్ స్తోత్ర మంజరి మరియు
శ్రీ సుబ్రహ్మణ్య స్తోత్రకదంబం [సంకలనం]
[శ్రీ దోర్నాదుల చిన్నవరదరాజులుగారి సౌజన్యం]

